ప్రథమ ముద్రణము.
విళంబి చైత్రము.



# స మ ర్ప ణ

" అవిద్యానామన్త స్తిమిర మిహిర ద్వీపనగరీ
జడానాం చైతన్య స్తబక మకరన్ద స్రుతిఝరీ,
దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రా మురరిపువరాహస్య భవతి "

'సౌందర్యలః

వెల : ఒక రూపాయి.

ముద్రణ
స్టార్ అండ్ కో.,

# విజ్ఞప్తి

భారతదేశం. అందును ఆంధ్రరాష్ట్రం చిరకాలంనుండి నేక కుటీర పరిశ్రమలకు నిలయ మని ప్రఖ్యాతి చెందింది. ంగ్లేయుల రాకకు పూర్వం గ్రామజీవితంలో కుటీర పరిశ్రమలకు త్యధికప్రాముఖ్య ముండేది. మనుష్యునిలో గల కళాకౌశల మును వ్యక్త పరచుటకు చేతిపనులు ముఖ్యసాధనములు. వ్యవసాయ పరికరములు, గృహోపకరణములునైన నిత్య జీవితావసర వస్తువులు మొదలుకొని, మహారాజ మందిరాల లోని కళాసంపదలన్నీ కుటీర పారిశ్రామికుని హస్త కౌశలమునే వ్యక్తపరచును. ఇట్టి పరిశ్రమ లన్నీ ఆంగ్లేయపరిపాలనా కాలంలో అవలంబన లేక నామమాత్రావశిష్ట మై పోయినవి. స్వరాజ్యం సంపాదించు కొన్న అనంతరం మన జాతీయప్రభుత్వం పునస్సముద్ధరణమునకు పూనుకొని ప్రాచీన కళాసంప్రదాయము లను, పరిశ్రమలకు తగిన ప్రోత్సాహము, చేయూత కలుగ జేయుట వలన పారిశ్రామిక లోకం లో మోడులు చిగిర్చి నట్లు ఒక నూతన వసంతోదయ మైనది.

ఆంధ్ర దేశం లో నేటికి వారసత్వ సంపదలు గా నిలిచి యున్న కొన్ని ముఖ్యగ్రామీణ పరిశ్రమల గురించి స్థాలీపులా కముగా, విజ్ఞానయాత్రా రూపంలో ఒకరైతు స్వప్నసంచారము

ఇతివృత్తముగా ఈ పుస్తకంలో సులభ గ్రాహ్యం గా వివరింప బడినది. మన ప్రాచీన కుటీర పరిశ్రమల పునరుద్ధరణ పట్ల ఆసక్తిని కలుగ జేసి, ఉద్యోగము చేయుట కంటె స్వతంత్రమైన ఒక వృత్తి నవలంబించి జీవనోపాధి గడుపుకొనుట లో గౌరవము ప్రతిష్ట గల దన్న భావమును పలువురు వయోజనులలో గలిగింప జాలిన చో ఈ రచన సార్థకమైనట్లే!

"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"!

'రచయిత'

# కృతజ్ఞత.



స్వరాజ్యం సంపాదించుకొన్న తర్వాత దేశపునర్నిర్మాణ సాధనలో సాహిత్య పోషణ బాధ్యతను మన జాతీయ ప్రభుత్వం చేపట్టి ప్రయోజనకరమైన ప్రణాళికలు అమలు జరుపుతున్నారు. అట్టివానిలో అక్షరాస్యులైన వయోజనుల విజ్ఞానాభివృద్ధికై జన రంజక సాహిత్యాన్ని ప్రోత్సహించే పోటీలను భారత ప్రభుత్వ విద్యాశాఖవారు నిర్వహించి అందలి ఉత్తమ రచనలకు బహూమతుల నిచ్చుచున్నారు. ఇందులకు రచయితలు - ప్రజలు గూడ భారత ప్రభుత్వమునకు కృతజ్ఞులు కావలసియున్నది.

ఈ పుస్తకమునందు ప్రచురించిన కొన్ని చిత్రముల ఫోటో బ్లాకులు నేను కోరినంతనే దయతో ఇచ్చి సహాయపడిన వదాన్యులు ఆంధ్ర పత్రికా సంపాదకులు శ్రీ శివలెంకశంభుప్రసాద్ గారికిని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపరిశ్రమలు, వాణిజ్య శాఖ డైరక్టరుగారికిని, కొన్ని రేఖా చిత్రములను బ్లాకులు తీయించుకొనుట కనుమతించిన ఆంధ్ర ప్రభుత్వ సమాచార, పౌర సంబంధముల శాఖ డైరక్టరు గారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఈ రచనకు ప్రోత్సహించి, సహాయపడిన మిత్రులందరకు నా కృతాంజలులు.

21-8-1958

— రచయిత.

# విషయసూచిక

# విజ్ఞాన యాత్ర

## కుటీర పరిశ్రమలు

అవి సంక్రాంతి పండుగ రోజులు. రైతులు ఏడాది పొడవునా పడినశ్రమకు ఫలితంగా ధాన్యలక్ష్మి యింటికి చేరుకుంటుంది. జీవితంలో పడే కష్టనిష్ఠురాలు ఒక్కమారు ఒత్తిగించుకొని ఆనందంతో జీవితం గడపడానికే పెద్దలు పండుగ దినాలు ఏర్పరిచారు. అది విశాఖపట్నం జిల్లాకు చెందిన ఒక చిన్న పల్లెటిగ్రామం. ఆ గ్రామం లో సుబ్బయ్య ఒక సామాన్య రైతు. మంచి, మర్యాదలు తెలిసినవాడు. ఎక్కువ విద్యావంతుడు, కాకపోయినా సంప్రదాయాలు తెలిసినవాడు. కల్ల, కపటాలు ఎరుగని జీవితం గడుపుతున్నాడు. అందరి వలె నే పండుగ నాడు సుబ్బయ్య తలంటుకొని, స్నానం చేశాడు. పెద్దలకు పెట్టుకుని క్రొత్తబట్టలు కట్టుకున్నాడు. బ్రాహ్మణునకు స్వయంపాకం ఇచ్చాడు. వ్యవసాయంలో తనకు సాయపడుతూ తనపైన ఆధారపడిన పాలికాపు, కుమ్మరి, కమ్మరి, చాకలి, మంగలి మొదలైన వాళ్ళకు ప్రతియేటా ఇచ్చే మామూళ్ల ధాన్యం కొలిచి ఇచ్చాడు. పుట్టింటికని వచ్చిన కుమార్తెకు చీర, రవికెల గుడ్డ, అల్లునికి పంచలచాపు ఇచ్చి, కట్టబెట్టి ఇష్ట మైన వంటకాల తో ఆరోజు మధ్యాహ్నము ఆనం

దంగా గడిపేడు, సాయంకాల మెంది. నాలుగు గంటలకు పొన్నుకఱ్ఱ చేత బుచ్చుకుని ఊళ్లోకి బయలుదేరేడు. భోగి నాటి మంటలు సంకురాతినాటి సాయంకాలం వరకు నగిళ్లు కాలు తూనే ఉన్నాయి. తిన్నగా కరణంగారింటికి వెళ్ళేడు. సుబ్బయ్యా కాపంటే కరణంగారికి చాలా ఆదరణ. నెమ్మదైన వాడని.... నిజాయితీ పరుడని. వారింట్లో రచ్చ చావడి లో తివాసీలు పరచి ఉన్నాయి. గ్రామపెద్దలు నలుగురూ చేరి ఏదో మాటాడుకుం టున్నారు, కరణంగారు సుబ్బయ్యను చూచి కూర్చోమని సౌంజ్ఞ చేసేడు. కరణంగారింట్లో ఆడపిల్లలు హడావిడిగా తిరుగుతున్నారు. ఇరుగు పొరుగు పిల్లలు, పెద్దలు పేరంటానికి వస్తున్నారు. ఇం తలో ఉప్పాడ జరీ అంచుల తలపాగా, చేతిలో దంతంపిడి మీద సింహ తలాటం చెక్కిన పొన్నుకఱ్ఱతో ఒక వ్యక్తి రాగానే కర ణంగారు, "రండి, మునసబుగారు" అని ఆహ్వానించారు, "దం డాలు" అని మునసబుగారు తనకు చూపిన కుర్చీలో కూర్చు న్నారు.

మునసబు : "చిన్నమ్మాయిగారు హడావిడిగా తిరుగుతున్నా రేమిటి?" అన్నాడు.

కరణం : "పండుగ కదూ! పిల్లలు బొమ్మల కొలువు తీరుస్తారు. లోపలికిరండి— చూద్దురుగాని" అని వారిని లోపలికి తీసు కుని వెళ్ళారు. సుబ్బయ్యకూడా వాళ్లతో లోనికి వెళ్ళాడు. అక్కడ ఎన్నో రకరకాల బొమ్మలు బల్లల మీద అమర్చబడి ఉన్నాయి.

మునసబు : "కరణంగారికి బొమ్మలంటే యింత సరదా అన్న మాట. ఇవన్నీ ఎప్పుడు కొన్నారు?

కరణం : ఇప్పటివా! ఏనాటివో! పిల్లల సరదా! కూటిపేద మొదలు కోటీశ్వరుని వరకూ బొమ్మలతో ఆనందించని వారెవ రుంటారు? అదుగో! ఈ అరలోనివన్నీ తిరుపతి చందనం బొమ్మలు. ఆ పై అరలో ఆ ఏనుగు అంబారీ- ఆ వరుసలోని దశావతారాలు- - కొండపల్లి బొమ్మలు. ఈదిగువ నున్న కొబ్బరిచిప్పా, గంధపు గిన్నెలు, లక్కసామానులు— ఏటికొప్పాకవి. ఎంత సొంపుగా ఉన్నవో చూడు!"

సుబ్బయ్య : "అచ్చంగా చేపను పొడుచుకు తింటున్నట్టే ఉన్నా యండీ! ఆ కొంగలు."

కరణం : "అవా, కొమ్ముతో విశాఖపట్నంలో చేస్తారు". అని అంటూ చావిట్లోకి వచ్చేరు. మునసబు చేతిలో ఉన్న దంతం పిడి కత్తిను చేత బుచ్చుకుని కరణంగారు పరిశీలించి "ఈ దంతంపిడి కత్తి ఎక్కడ సంపాదించా వయ్యా?" అన్నాడు.

మునసబు : "అబ్బో! దానికంతా చాలా కథ ఉంది" అన్నాడు.

కరణం : ఆకథ ఏమిటో చెప్పవయ్యా" అన్నాడు.

మునసబు : "ఇది తాటిచేవకత్తి. మా అయ్య బాగున్నపుడు ఏలూరులో కొని తెచ్చాడు. ఆ మధ్య మా పెద్దమాన్యం తగాదాలో విశాఖపట్నం కోర్టుకి వెళ్ళినపుడు అక్కడ దఫ్తీరుగారింట్లో మాటాడుతుంటే ఒక కంసాలి వచ్చి దంతంపిడి వేసిన వంపుకత్తి తెచ్చి ప్లీడరుగారి కిచ్చేడు. నా చేతిలో చేవకత్తి

అతని కంట బడింది. అతగాడు నాచేతిలో వున్న చేవకఱ్ఱ చూచి "బాబూ, దీనికి దంతంతో సింహతలాటం వేయిస్తే, బాగుంటుం" దన్నాడు. వెంటనే ప్లీడరుగారు "ఇతడు చాలా మంచిపనివాడు. తప్పకుండా చేయించ మన్నాడు. 'సరే' పదన్నాను నేను. మళ్ళీ నెలవాయిదాకు వెళ్ళేసరికి సింహం బుఱ్ఱతో పిడి తయారు చేసుకొచ్చాడు. ఏదోకొంత అతని చేతిలో పెట్టేను. అది లగాయతు యీకఱ్ఱను చూచినపుడల్లా ప్రతీవారూ ఈ సింహాన్నిచూచి ముచ్చట పడుతూ ఉంటారు.

కరణం : సింహం ముఖం ఇంత ఒడుపుగా చెక్కినకఱ్ఱ ఎక్కడా చూడలేదయ్యా! ఇలాంటి పనివాళ్లు ఇంకా ఉన్నారా అని పిస్తుంది, చూడు! ఈ చావిట్లో పరచిన తివాసీ మా తండ్రి గారి నాటిది. ఇది ఏలూరులో తయారైంది. ఎన్నాళ్ళయినా ఆ రంగు, మెత్తదనం ఎలా ఉన్నవో చూడు!"

మునసబు : "అవునండీ! మననాటున ఎంతెంత పని వాళ్లయినా ఉండేవారు."

సుబ్బయ్య : కరణంగారూ! ఒక్కమాట, మా తాతయ్య విజయ నగరం దివాణంలో పనిచేసేవాడు. అతగాడు ఎప్పుడూ ఒక కైజారు మొలలో పెట్టుకొని వెడుతూండేవాడు. దానిని మహారాజులుంగారు స్వయంగా, వేటలో పులిని కొట్టినందు కిచ్చారుట. ఆ కైజారు పిడి ఇలాగే దంతంతో చెక్కిందే. ఆ లతలు, నగిషీపని, తమరు చూస్తే ఎంతయినా మెచ్చుకుంటారు. దానికి ఒరపోతే అలాపెట్టిలో ఉంచేశాము.

కరణం : ఒరలంటే జ్ఞాపకం వచ్చింది. మా చిన్నతనంలో విజయనగరం మహారాజులుంగారి హవేళీకి మందసా నుంచి కత్తులకు ఒరలు కట్టించడానికి, దానిమీద నగిషీపనులు చేయించడానికి పనివాళ్ళను పిలిపించారు. కత్తివంపు ఎలాఉందో అలాగే బాడితకఱ్ఱ చెక్కి దానిని చెరిసగం రెండు బద్దలుగా కోశాడు. ఆ బద్దలో కత్తికి సరిపోయే గుల్లదొలిచి రెండు డిప్పలూ అతికి దానిమీద పలుచని తోలుపొర అంటించాడు. దాని మీద ఎఱ్ఱరంగు- రంగుమీద లక్కపూత మెరుగుపెట్టి ఎంత పసందుగా చేశాడో ఇప్పటికీ రంగు మాయలేదు కళ్లకు కట్టినట్లుంది. ఇప్పుడా కైజారు లెక్కడివి ? ఆ పనివాళ్లెక్కడున్నారు ?"

మునసబు : "అదంతా ఎందుకండీ కరణంగారూ! ఇప్పుడు కట్టే లోగిళ్ళకు సింహద్వారాలు చూడండి. ఒక్క తీగె లతైనా ఉండదు. అన్నీ బోడి గుమ్మాలే కదా!"

కరణం : "అసలు మన సంప్రదాయాలే పోయాయి కదయ్యా. అంచులేని బట్టకటడం అమంగళం అన్నారు. అకునో, పువ్వునో, చెక్కని పళ్లెంగాని, పాత్రగాని ఉండేదా. మన ఇళ్లల్లో!

సుబ్బయ్య : "ఇలాంటి పనులన్నీ ఎలా నశించి పోయా యంటారు కరణంగారూ ?"

కరణం : అదంతా పెద్దగాథ, రోజులూ, నెలలూ చెప్పినా తరగదు. మన దేశంలో గల చేనేతను గూర్చిన కథ చెపుతా

విను. నూరు, నూట యాభై సంవత్సరాల క్రితం ఢక్కా నేతగాళ్లు ముప్పయిరెండు మూరల చేనేతబట్ట ఒక అగ్గిపెట్టె లో పెట్టి విక్టోరియా రాణి పట్టాభిషేకానికి పంపించారుట. ఆమె ఆసన్నని పనితనం చూచి ఆశ్చర్యపోయిందట. 'అలీ బేగ్' అను పారశీకరాయబారి కళ్లికోట లో డెబ్బది మూరల తలపాగా కాని నవరత్నఖచిత మైన చిన్న కొబ్బరికాయ లో అమర్చి తన చక్రవర్తికి కానుకగా పంపించాడట. మన ఢక్కా రవశెల్లాలు. బందరు కలంకారీ అద్దకములు. కాశ్మీరు శాలువలు చూచి తెల్లదొరలు ఆశ్చర్యచకితులయేవారు. ఇటు వంటి పనివాళ్ల గతి ఏమయిందో తెలుసా ?"

సుబ్బయ్య : "ఏమయింది బాబూ ?

కరణం : ఇంగ్లీషువాళ్ల హయాం లో యీ పనివాళ్ల బొటనవ్రేళ్లు తెగనరికి వాళ్లకి పనిచేసికొనే వీలు లేకుండా చేశారు."

మునసబు : ఎంత అన్యాయమండీ, కారణం ఏమిటంటారు ?

కరణం : వాళ్ల మిల్లులమీద తయారైన సన్నబట్టలు మన చేనేత బట్టలముందు తీసికట్టుగా యుండేవి. అందం లేదు. మన్నికా లేదు. అందుచేత మన మార్కెట్టులో వాళ్లబట్ట చెలామణీ కాదేమోనని చేసిన దురన్యాయం. ఈ విధంగా పేరుకెక్కిన ఎన్నో పరిశ్రమల్ని సర్వనాశనం చేశారు. కోట్లకొలది ధనం దోచుకు పోయారు తెల్లదొరలు.

సుబ్బయ్య : రామ ! రామ ! ఎంత అన్యాయమండీ !

మునసబు : నే చెపుతాను విను. మిల్లులొచ్చాక దంపుడుబియ్యాలు పోయాయి, మరబియ్యా లొచ్చాయి. శరీరం లో బలం, మెద

డులో జ్ఞానం, రెండూ క్షీణించి పోయాయి. ఈ మరలొచ్చి చేతిపనులను చెడగొట్టాయి కాదుటయ్యా!

కరణం: నీవు చెప్పింది యథార్థమే గాని- సుమారు రెండువందల సంవత్సరాల బానిసత్వంలో వాళ్లు మన వృత్తులకు మనలను దూరం చేసి వట్టి గుమాస్తారాయిళ్లుగా తయారు చేయడం వల్లనే యీగతి పట్టింది.

సుబ్బయ్య: గుమాస్తా పని మంచిది కాదంటారా బాబయ్యా?

కరణం: అమాయకుడా! 'కులవృత్తికి సాటి రాదు గువ్వల చెన్నా' అని వినలేదా? ఒకడిచేత మొట్టికాయలు తింటూ వాళ్ల అడుగులకు మడుగు లొత్తుతూండడం కంటే స్వతంత్రంగా ఒకవృత్తి చేసికొనడం మంచిదని వేరే చెప్పాలా, సుబ్బయ్యా.

మునసబు: వృత్తులకు పెట్టుబడి కావద్దండీ, బాబు! అందుకని ఉద్యోగాలకు జొరబడుతున్నారు. ఏదోవిధంగా పొట్ట పోసుకోవాలి కదా!

సుబ్బయ్య: నిజమేనండి. వ్యవసాయానికే పెట్టుబడి లేకుండా ఉంటే వృత్తులకు పెట్టుబడు లెక్కడివి?

మునసబు: చేతిలో విద్యలుపోయి కాయకష్టము పడలేక వళ్లు వంచలేక కుర్చీలో కూర్చో మరిగిన వారికి మళ్లీ పనిపాటలు చేసికోవడం ఎవాలా అబ్బుతుందండీ?

కరణం: అలాకాదు. అందరూ ఉద్యోగాలే కావాలంటే ప్రభుత్వం వార్లు మాత్రం ఎంతమందికిస్తారు? ఐనా మన అభిప్రా

యాలు పూర్తిగా మార్చుకోవాలి. ఉద్యోగం చేస్తే గౌరవమని, వృత్తి చేస్తే హీనమనే అభిప్రాయం ఇంగ్లీషు పరిపాలన రోజులలోనే ఏర్పడింది. ఉద్యోగం చేసేకంటె వృత్తి చేసు కుంటె గౌరవ మన్న సంగతి మనం గుర్తించాలి.

సుబ్బయ్య : నిజమేనండి ! మన చిన్ననాటి రోజులలో ఎవరి పనులు వారు చేసికొని బ్రతకలే ! ఇప్పుడు మళ్లీ వృత్తులు చేసికోవాలంటే, పేదవాళ్లకి పెట్టుబడి లేకగాని—

కరణం : మొన్న మొన్ననే పరిశ్రమలశాఖామంత్రి మన గ్రామం వచ్చి ఏమన్నారో తెలుసా ? మనకు స్వరాజ్యం వచ్చిన నాటి నుండి మన కేంద్రప్రభుత్వమువారు ప్రత్యేకశ్రద్ధ తీసి కొని మళ్లా దేశంలో చేతిపనులు వృద్ధి పరచటానికి అనేకప్రణాళికలు తయారు చేస్తున్నారని చెప్పారు.

సుబ్బయ్య : గవర్నమెంటు ఫాక్టరీలు, మిల్లులు పెట్టిస్తుందిగాని చేతిపనుల కేం చేస్తుందండి ? మీరలా అంటారుగాని వీళ్లను చూసే దెవరండీ ?

కరణం : అలాకాదు. వినుమరి. భారీయంత్రపరిశ్రమలకు, తక్కువ పెట్టుబడుల తో నిర్వహించే కుటీరపరిశ్రమలకు. పోటీ లేదని నిపుణులు తేల్చేరు. ఒకే పెట్టుబడితో భారీపరిశ్రమలు చూపగల ఉద్యోగావకాశాల కంటె చేతిపనుల ద్వారా నూటికి పది హేను, ఇరవై పాళ్లు పనిపాటలు చేసుకునే వారికి ఎక్కువ సాయపడుతుం దని గవర్నమెంటువారు గుర్తించారు. రెండవ పంచవర్షప్రణాళికలో చేతిపనుల అభివృద్ధికోసం రెండువందల

కోట్లు ప్రత్యేకించారు. వీటివల్ల పెట్టుబడులు, విక్రయ సౌక ర్యాలు, పనులు నేర్పించడానికి ట్రైనింగు ఏర్పాట్లు చేసి అన్ని విధాలా యీ కుటీరపరిశ్రమలను తిరిగి పూర్వపుటౌన్నత్యానికి తీసుకు రావాలని అనేక విధాల ప్రయత్నిస్తున్నారు.

మునసబు : నిజమేనండి ! ఏ డెనిమిది వందలరూపాయల పెట్టుబడితో కుమ్మరం, కమ్మరంవంటి పనిపాటలు చేసుకుంటే ఒక కుటుంబం నిశ్చింతగా బ్రతుకవచ్చు. అవేమిల్లులుపెట్టాలంటే లక్షలు కావాలి. ఇలాంటి పనులకు ప్రజలుకూడా కలిసివస్తే ఆ ఫలితం దక్కుతుంది.

కరణం : ఎందుకు కలిసిరారండీ ? నూటికి తొంభై మందికి రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి. 'రా, పనిచూపిస్తాం' అంటే వెళ్ళకపోవడ మేమిటి ?

సుబ్బయ్య : ఆమాత్రం సహాయం గవర్నమెంటువారు చేస్తే కావలసిందేముందండి ? ఆ పనిపాటలే చేసుకోవచ్చు.

కరణం : అంతేగాదు. ఆ యా పారిశ్రామికుల్లో ఈ నాటికి కృశించి పోతూన్న కులవృత్తులను పోషించు కుంటూ కాలక్షేపం చేస్తున్న వా రనేకమంది వున్నారు. అందుకు ఈ మునసబుగారి చేతిలో ఉన్న దంతంపిడే నిదర్శనం. మన దేశంలో, అందులోనూ, తెలుగు దేశంలో ఎంతెంత పనివాళ్లయినా ఉన్నారు. మనకు క్రొత్తగా యేర్పడిన ఆంధ్ర రాజధాని హైద్రాబాదు అపురూపమైన చేతిపనులకు అనాదిగా ప్రఖ్యాతి ఉంది. ఈ నాటికీ వరంగల్లులో తివాసీలు, నిర్మలలో

కొయ్యబొమ్మలు, కత్తులు తయారుచేస్తారు. కరీంనగరంలో వెండి బంగారు జలతారుపనులు, బీదర్‌లో బిద్రీ అనే లోహం పనులు, 'పైఠాన్'లో వింతవింతలైన చీరలఅంచులు తయారవుతున్నాయి. తిరుపతి, కాళహస్తి, కొండపల్లి పట్టణాలు, అందమైన బొమ్మలకు ప్రసిద్ధి. విశాఖపట్నంలో దంతం పనులు, ఏటికొప్పాకలో లక్కసామానులు తయారు చేస్తారు. మెదక్, మచిలీపట్నం, కలంకారీఅద్దకాలకు ప్రపంచఖ్యాతి పొందాయి.. పాపానాయుడుపేటలో గాజుపూసలు తయారు చేస్తారు. బొబ్బిలి, పిఠాపురప్రాంతాలు వీణల తయారీకి ప్రసిద్ధికెక్కాయి, పాలకొల్లు, నరసాపురం ప్రాంతాలలో తయారయ్యే లేసులు కుట్టుపనులు విదేశాలలో డాలరుద్రవ్య సంపాదనకు పనికివస్తాయి. ఇటువంటి అందమైన చేతిపనులు వసంతంలో మోడులు చిగిర్చి నట్లు వృద్ధిపొందే అవకాశాలున్నాయి. ఈ తరుణంలోనే గవర్నమెంటువారిచ్చే చేయూతను పారిశ్రామికులు గ్రహిస్తే అనేకమంది నిరుద్యోగులకు చక్కని ఉపాధి ఏర్పడుతుంది.

సుబ్బయ్య: బాబూ! ఈ రోజుల్లో కూడా యీపనులు గిట్టుబాటు అవుతాయంటారా?

కరణం: ఇంతవరకూ యీ చేతిపరిశ్రమలకు ఒక చిక్కు వచ్చింది. పెట్టుబడిదారుని దయాధర్మం మీద పనివాడు ఆధారపడ్డాడు. అందువల్ల అతడు ఏధర యిస్తే దాని ప్రకారమే పుచ్చుకుని వాళ్ల జీవనోపాయం గడుపు కునేవారు. గాంధీ

మహాత్ముడు నూలు తీసినందుకుగాని, నేత నేసినందుకుగాని పనివాడికి కడుపునిండే విధంగా కూలి నిర్ణయించేడు. అందుకు తగినట్టుగా ప్రభుత్వంవారు మిల్లుసరకులకూ, చేతిపనులకూ ధరలో తేడా అంతగా లేకుండా ఉపాయాలాలోచిస్తున్నారు. చేతిపనులప్రోత్సాహానికి అనేక విధాల సహాయానికి పూనుకుంటున్నారు.

సుబ్బయ్య : అలాగాండీ ! గవర్నమెంటే తలచుకుంటే వీటికి లోటుండదు.

మునసబు : పండుగరోజున మంచికాలక్షేపం చేశారండీ. మరి శలవిప్పిస్తారా ?

కరణం : మీ సింహతలాటం దంతంపిడే యిన్ని ముచ్చట్లూ చెప్పించింది.

సుబ్బయ్య : బాగా చెప్పారు. శలవు దయచేయించండి.

కరణం : చాలా ప్రొద్దు పోయిందికూడాను. మంచిది వెళ్లిరండి.

* * * *

సుబ్బయ్య ఇల్లు చేరుకున్నాడు. బాగా చీకటిపడింది. భోజనంచేసి, కరణంగా రింట్లో జరిగిన సంభాషణలు తలచుకుంటూ వెన్నువాల్చాడు. చేతిపనుల్లో ఉండే అందచందాలు గుర్తుకు వచ్చాయి. మానవుని చేతిలో ఎంతయినా మహిమ ఉన్న దనుకొన్నాడు. ఆ పనులన్నీ ఎలా చేస్తారో ఎప్పటికయినా చూడా లనుకున్నాడు. ఈ ఆలోచనలతో నిద్రపోయాడు. నిద్రలో కల - కలలో ఒకయాత్ర సాగిపోతోంది.

—— G 9/95

# దంతపుపనులు: విశాఖపట్టణము

సుబ్బయ్య ఒక బస్సులో ఉన్నాడు. ఆ బస్సు తిన్నగా విశాఖపట్నంలోని "టర్నర్స్ చౌల్ట్రీ"మీదుగా పోయి సముద్రం ఒడ్డున నడుస్తూంది. సుబ్బయ్య ఆలోచనలు ఆ సముద్రతరంగాల వలెనే ఒకదాని వెనుక ఒకటి తరుముకువచ్చి విరిగిపోతున్నాయి. బస్సు ఒకచోట ఆగింది. సుబ్బయ్య బస్సు దిగాడు. అది ఒక దంతపుపనుల కార్ఖానా. కొందరు శిల్పులు పనిచేస్తున్నారు.



పనిచేస్తూన్న శిల్పులు.

పలుచని దంతంరేకుమీద సన్నని నగిషీపనిచేసి చందనంపెట్టెల మీద తాపడం చేస్తున్నారు. అచటి పనివారంతా విశ్వబ్రాహ్మణులు. సన్ననిరంపాలు. చిన్న చిన్న ఆకురాళ్లు, మూలమట్టం, సుత్తి, బాడిత మొదలైన పరికరాలు ఆ పనివాళ్లముందున్నాయి. ఈ



దంతపువస్తువులు చేయడానికి సున్నితమైన పనిముట్లు.



పనిపూర్తిగావింపబడిన దంతపుపెట్టెలు.

పనిముట్లు చాలాసున్నితంగా ఉన్నాయి. వేరేప్రక్కను అదాల

బీరువాలో వారు తయారుచేసిన సామానులు అందంగా అమర్చి ఉన్నాయి. మన సుబ్బయ్యకాపు వాటన్నిటినీ వింతగా చూస్తు న్నాడు. ఎంతో ఆసక్తితో పరిశీలన ప్రారంభించాడు. బంగారం నగలుపెట్టుకొనే రకరకాల పెట్టెలు, పటంచట్రాలు, సిగరెట్టు పెట్టెలు, దువ్వెనలు, కాగితంకోసికొనే బద్దలు, ఆఫీసర్ల బల్లమీద ఉండే సూదులుగ్రుచ్చుకొనె దిండ్లు ఒక బీరువాలో ఉన్నాయి. దేవతావిగ్రహాలు, రకరకాల పక్షులు, ముఖ్యంగా కొంగలు, బాతులు ఉన్నాయి. కుర్చీలు, మంచాలు ఆటసామానులవంటివి చిన్నరకం కూడా ఉన్నాయి. ఆ పనివాళ్లు చేస్తున్నవిధానమంతా సుబ్బయ్య శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు. కొంతసేపటికి " ఈ దంతం ఎక్కడ దొరుకుతుందని " వాళ్లని ప్రశ్నించాడు. ఆ పారిశ్రామికుడు



ముడిపదార్థాలు:- దంతం, కొమ్ము, తాబేటిడిప్ప, చందనపుకట్టె.

"మైసూరు రాష్ట్రంనుండి ఈ ఏనుగదంతం తెప్పించుకొంటాం. దంతం అంటే ఏనుగకోరలు. సాధారణమైన ఏనుగదంతం ఏడు మొదలు పది అడుగుల పొడవు 50 మొదలు 200 పౌనుల బరువు ఉంటుంది. చనిపోయిన ఏనుగుదంతాలను గవర్నమెంటు అటవీ శాఖవారు వేలంవేస్తే వర్తకులుకొని మాకమ్మతారు." అని వివరించాడు.

సుబ్బయ్య : అయితే బాబూ! ఈ సామానులు ఎవరో ధనికుల కుగాని పేదవాళ్లకు అవసరంలేదుగదా మీకు ఈపనిచేసికొంటే కూలి ఏంగిడుతుంది ?

పారిశ్రామికుడు చిరునవ్వునవ్వి "బొంబాయి, మదరాసు వంటి పట్నాలలోఉన్న ధనికులు ఈ సామానులు తెప్పించుకొం టారు- పూర్వం మహారాజు లుండేవారుగదా. వారున్నన్నాళ్లు మా తాతముత్తాతలకు చేతినిండా పనిఉండేది. ఇప్పుడు ఉన్నది గాని, అంతగా లేదు. రోజుకూలి రూపాయిన్నర, రెండు రూపాయలు గిట్టుబాటుకు లోటుఉండదు. అందటికీ అందుబాటులో ఉండే సరకులుకూడా ఉన్నాయన్నాడు. బొత్తాలు, గాజులు, దువ్వెనలు, పూసల పేర్లు చూపించాడు. సుబ్బయ్యకు ఆ వస్తువులుకూడా నిత్యావ సరములలో పనికివచ్చేటట్లు తోచలేదు. అటనుండి బయ లుదేరి బస్సులో కూర్చు న్నాడు. బస్సు బయలుదే



రింది. దారిలో కొన్నివీధులలో పార్వతీపురం, బొబ్బిలి, సర్వసిద్ధి తాలూకాలలో తయారైన ఇత్తడిసామానులతో కన్నుచెదరిపో తూంది. బస్సు తిన్నగావచ్చి వాల్తేరు స్టేషనులో ఆగింది. అనుకో కుండానే తాను స్టేషనులో బయలుదేరబోతున్న రైలులో కూర్చు న్నాడు. అది శరవేగంగా బయలుదేరి అనకాపల్లిస్టేషనులో ఆగింది. ప్లాట్‌ఫారంబయట బస్సు సిద్ధంగాఉంది. రైలుదిగి బస్సులో కూర్చున్నాడు. బస్సు ఒక్క గంటలో ఏటికొప్పాక తీసికొని పోయింది.

---

## లక్కసామానులు:—ఏటికొప్పాక.

ఆ గ్రామంలో ఒకవీధిలో సుబ్బయ్య నడుస్తున్నాడు. ఇంటింటా అరుగులమీద ఒక తటిమెనబెట్టు దొడ్డి, తెల్లని కొయ్య, చేసి రాసిగాపోసిన లక్కపిడతలు కనపడుతూన్నవి. ఒక అరుగుమీద పనిచేస్తున్న ఒక కంసాలిని “ అదేంకఱ్ఱ బాబూ ! ” అని మన సుబ్బయ్య ప్రశ్నించాడు.

“ఇదిగో ! ఇది అంకుడుకఱ్ఱ, ఇది గిరిమల్లికఱ్ఱ”

“ఊరంతా ఇదేపనిచేస్తారా ? చిత్రంగాఉందే ?”

“ఊరంతా ఎంతఉందిలెండి ! మా పనివాళ్ల కుటుంబాలు సుమారు నూటయాభై పైగాఉంటాయండి. అందరికీ ఇదేపని” అన్నాడా పనివాడు. ఆపనిచూస్తూ ఒక కార్ఖానావద్ద ఆగేడు సుబ్బయ్య. ఒక అడుగు తెల్లని ఆరినకఱ్ఱను కోసి తటిమెన



ఏటికొప్పాక లక్కసామానులు.

దొడ్డిలో అమర్చేడు. ప్రక్కను ఒక కూలివాడు తఖిమెనదొడ్డికి అమర్చిన చక్రం తిప్పుతూన్నాడు. పనివానిచేతిలో ఉలి ఉంది. దానిని ఆ కఱ్ఱకు అదిమిపట్టి ఉంచేడు. చూస్తుండగానే లక్క పిడతల ఆకారాలు వరుసగా ఆకఱ్ఱలో తయారౌతున్నాయి. ఏవో రంగుకణికెలుతీసి ఒకదానిప్రక్కనుఒకటి అదిమిపట్టి రాస్తే ఆ పిడతలకు రంగులుతయారైనాయి. క్రొవ్వులో కరిగిపోసిన కణికెలు రంగులువేయుటకు ఉపయోగిస్తున్నారు. ఒక ఎండు పనసాకుతో పైన అదుమగానే లక్కరంగు తళతళామెరుస్తూ లక్కపిడత తయారైంది. ఈవిధంగానే చూస్తుండగానే పన్నీరు బుడ్లు, భరిణెలు, చంటిబిడ్డలు ఆడుకునే ఆటవస్తువులు, సంసారపు పాత్రసామగ్రి ఎన్నోరకాలు చెక్కి రాసిపోస్తున్నాడు. మరొక శిల్పి చతురంగబలం సంతనగా తయారుచేస్తున్నాడు, నల్లని ముదురు కొబ్బరిచిప్పలను అందంగాకోసి వాటికి నున్నగా తఖిమెనపట్టి భరిణెలు, గంధపుగిన్నెలు తయారుచేస్తున్నారు. సుబ్బయ్య మామూలుధోరణిలో "ఏవిధంగా మీకీపని కిట్టుబాటవు తుం"దన్నాడు.

"ఏం కిట్టడ మండి. రెక్కల కష్ట మంతా మాది. ఫలితం పెట్టుబడి దారునిది. ఆయన మాకే ధర యిస్తే ఆ ధరకే ఇది వరలో అమ్మవలసి వచ్చేది. రోజుకు 12అణాలు కూలి గిట్టితే గొప్పగా ఉండేది. గవర్నమెంటువారు సొసైటీలు పెట్టి వృత్తికి పెట్టుబడులు, అమ్మకం సదుపాయాలు చూస్తున్నారు గనక కొంత నయ మండి" అన్నాడు- సుబ్బయ్యకు ఈ పొట్టపోసుకునే

మార్గాలు చూస్తుంటె ఆశ్చర్యంగా ఉంది. ఇంతలో బస్సు సిద్ధమైంది. మరోక్షణంలో రైలులో ఉన్నాడు- రైలు నిడదవోలు స్టేషనులో ఆగింది. ఎదురుగా ప్లాట్‌ఫారం మీద నరసాపురం బండి సిద్ధంగా ఉంది. ఈ రైలుదిగి ఆ రైలులో కూర్చున్నాడు. బండి తిన్నగా పోయి పాలకొల్లులో ఆగింది. రైలుదిగి ఊళ్ళోకి బయలుదేరేడు- పాలకొల్లు సంతగురించి ఇదివరలో సుబ్బయ్య విని ఉన్నాడు.

## పాలకొల్లు, నరసాపురం లేసుఅల్లికలు.

పంచారామాల్లో ఒకటైన క్షీరారామానికే తెలుగు పేరు పాలకొల్లు. ఆంధ్రదేశంలో ఇదొక సుప్రసిద్ధ శైవక్షేత్రం. ఈ గ్రామంలో వెలసిన దేవుడు రామలింగేశ్వరస్వామి. క్రైస్తవమత బోధకులు మన దేశంలో వారి మతప్రచారం చేస్తూ క్రొత్తగా మతం పుచ్చుకొన్నవారి జీవనోపాధికి ఉపయోగించే ఒక చేతి పనిని కూడా నేర్పాలని ఆలోచించేరు. విదేశాలలోని స్త్రీలు తమ తీరిక సమయాల్లో కాలాన్ని వృధా చేయక ఏదో ఒక చేతిపని చేస్తూంటారు. అట్టి పనులలో లేసు అల్లికలు చాలా ముఖ్యమైనవి. "మిస్‌కెయిన్" అనే దొరసాని మొట్టమొదటి సారిగా తూర్పు గోదావరిజిల్లా మన్యప్రాంతంలో ఉన్న దుమ్ముగూడెంలో కొందరు స్త్రీలకు మతబోధ చేయడాని కని వెళ్లి ఈ లేసు అల్లికలు కూడా నేర్పింది. క్రమక్రమంగా పాలకొల్లు నరసాపురం ప్రాంతాల స్త్రీలు కూడా ఈ చేతిపనిని నేర్చుకొని ఒక చిన్న ఉపవృత్తిగా ఏర్పాటు

చేసికొన్నారు. తయారైన సరకును ఈ మిషనరీలు విదేశాలకు ఎగుమతీ చేసి వారికి ఇదొక రాబడి సాధనంగా చేయగానే చాలా మంది ఈ పనికి ఆకర్షింప బడ్డారు.

పాలకొల్లు నరసాపురం, దుమ్ము గూడెము కేంద్రాలకు ఈ నాటికి ప్రపంచవిఖ్యాతి ఉంది. నరసాపురం తాలూకా ప్రాంతం నుండి 15లక్షల రూపాయల విలువ చేసే సరకు సాలీనా ఎగుమతి అవుతుంది. ప్రభుత్వంవారు విదేశీ మారక ద్రవ్యమైన డాలర్లు సంపాదించడానికి కూడా ఈ పరిశ్రమ తోడ్పడుతుందంటె ఆశ్చర్యం కలుగవచ్చు. కాని ఈ విషయాలు ప్రభుత్వంవారి లెక్కలను బట్టి మనం గ్రహించవలసిన నగ్నసత్యాలు. మన సుబ్బయ్య పాలకొల్లు, నరసాపుర ప్రాంతాలలోని వర్తక ప్రాముఖ్యత గురించి విన్నాడు. కాని ఈ లేసులు, అల్లికలు, వీటి వ్యాపార సరళి విని నిర్ఘాంతపోయాడు. ఇటువంటి వృత్తు లుంటాయని గాని, వాటి వల్ల జీవనోపాధి గడుస్తుందని గాని అతనికి తెలియదు. కోటి విద్యలు కూటి కొఱకే గదా! అనుకున్నాడు. ఆలోచించగా తాసిల్దారుగారు జమాబందీకి వాళ్ల గ్రామం వచ్చినప్పుడు కూర్చునే కుర్చీ ముందుండేబల్ల మీద కరణంగారూ తెచ్చి పరచిన వలగుడ్డ జ్ఞాపకానికి వచ్చింది. దాని మీద రంగు దారాలతో ఎవో పువ్వులు కాయలు అల్లి ఉండడం కూడా గుర్తుకు వచ్చింది. ఈ పనులన్నీ ఆబాపతే అయి ఉండాలని అనుకుంటూ భోగట్టా చేస్తూ వారిలో రకరకాల అల్లిక గుడ్డలు అమ్మకాని కని ఉంచిన ఒక షాపు వద్ద ఆగేడు. ఆ షావుకారిని ఈ అల్లిక పనులు ఎలా

చేస్తారో వివరించ మని అడిగేడు. కుతూహలంతో అడిగిన మన సుబ్బయ్యకు ఈ విధంగా చెప్పేడు ఆ షావుకారు.

ఈ పనిలో కావలిసినవి నూలుదారం, ఒకరకం సూది ముఖ్యపరికరాలు. ఇదివరలో ఈ రెండింటినీ కూడా విదేశాల నుండే తెప్పించుకో వలసి వచ్చేది. ఈ నాడా యిబ్బందిలేదు. నూలు దారాలు అనేక రంగులలో ఉపయోగిస్తారు. సూది ఒక్కటి 2 అణాలు, 4 అణాలు ఖరీదుంటుంది. 12 నెంబరు 13 నెంబరు నూలుదారాలు ఈ పనులకు సాధారణంగా ఉపయోగిస్తారు. ఈ దారాలను డైమనుదారం అంటారు. 30 నంబరు దారం కూడా విరివిగా ఉపయోగిస్తారు. 12 అణాలు మొదలు, 14 అణాల వరకు దారపుండ ఖరీ దుంటుంది. (ఈ ఖరీదులు కాలాను గుణ్యంగా మారు తూంటాయి.) రోజు 1కి 6గంటలు మొదలు 10గం॥వరకు పనిచెయ్య గలవారున్నారు. ఈ అల్లిక పనులలో చేతిరుమాళ్లు, బల్లల మీద వేసి కొనే గుడ్డలు, అంచులు అల్లికలు సాధారణంగా తయారు చేస్తారు. దుమ్ముగూడెంలో తయారైన పెండ్లి ముసుగులకు (Wedding Veils) ప్రపంచవిఖ్యాతి ఉంది. పాలకొల్లు నమూనాలలో ప్రత్యేకమైన పూలలతలు గులాబీలు అల్లుతారు.

ఈ పనిలో కూడా పెట్టుబడిదారుని బెడద చాలా ఉంది. వారి అనుగ్రహంమీదనే ఈ పనులు ఆధార పడి ఉన్నాయి. వినియోగదారునకు పనివారికి మధ్యవర్తిగా ఈ పెట్టుబడిదారు లుండి ఈ వ్యాపారం నడిపిస్తూంటారు. పని యొక్క నాణ్యమును

బట్టి, ఆ పని పూర్తిచెయ్యడానికి పట్టే కాలవ్యవధిని బట్టి దాని మజూరీ నిర్ణయిస్తారు. కేవలం ఈ పనుల మీదనే ఆధారపడి పొట్ట పోసికోవడం మాత్రం సాగదు. ఒక పనిని చేసికొంటూ తీరిక సమయాల్లో స్త్రీలు ఈ పనులు చేస్తూంటె ఏదో కొంత పై ఖర్చుకు ఆదాయం చేసికోవచ్చును. ఈ లేసు అల్లికలు ప్రత్యే కంగా చేసి నప్పటికి 6 మొదలు 12రూ॥వరకు గిట్టుబాటు కావచ్చు నని పూర్వపు అంచనా. ఈ రోజులలో కొంత నయంగా ఉండ వచ్చును. వల అల్లికలకు రోజుకు 4అ మొదలు 8 అణాల మాత్రం కూలి గిట్టుబాటవుతుంది. చాల మంది గృహాల్లో ఇది తీరికసమయాల్లోనే చేస్తారు గాని ప్రత్యేకం ఉపాధిగా చెయ్యరు. అని వివరించేడు. ఈ మాట సుబ్బయ్యకు విషయం కొంత అవ గాహన అయింది. వ్యవసాయం పనులు లేనప్పుడు ఉపాధికి తోడ్పాటుగా చేసికొనే నూలుతీయటం మొదలైన పరిశ్రమల వంటివే గదా ననుకున్నాడు. ఈ వింత అనుభవాలను తలుచు కుంటూ, స్టేషనువైపు మళ్లాడు. నిడదవోలు బండి సిద్ధంగా ఉంది. నిడదవోలులో రైలెక్కి ఏలూరు చేరుకున్నాడు.

## తివాసీలు – రత్నకంబళ్లు

ఏలూరు చేరగానే సుబ్బయ్యకు కరణంగారింట్లో జరచిన తివాసీ, పండుగనాటి సంభాషణ జ్ఞాపకానికి వచ్చేయి. కొట్లొక్కి క్రమక్రమంగా ఈ తివాసీల గురించి భోగట్టా తెలిసికుంటూ బయలుదేరేడు. తివాసీల నేత పరిష్యాదేశానిది. అక్కడ ఉన్ని

విస్తారంగా లభించడం వల్ల ఈ పరిశ్రమ బాగా అభివృద్ధి పొందింది. 16వ శతాబ్దంలో అరబ్బులు మన దేశం వైపు విస్తరించినప్పుడు కృష్ణా గోదావరీ జిల్లాలు తివాసీల నేతకు బాగా అనుకూలమైన వని గ్రహించారు. అప్పుడే కొందరు అరబ్బు లీప్రాంతాల్లో స్థిరపడ్డారు. ఇప్పటికీ ఈ వృత్తి పూర్తిగా మహమ్మదీయులకే సంబంధించి ఉంది. ఒరంగల్, ఏలూరు ప్రాంతాల్లో తయారైన తివాసీలు 1857 నాటికే బ్రిటిష్ఎంపైర్ ప్రదర్శనంలో పేరు పొందేయి.

శీతలప్రాంతాలలో ఉండే గొఱ్ఱెలకు శీతకాల ప్రారంభంలోనే పొడవైన ఉన్ని పెరుగుతుంది. వేసవి ప్రాంతానికి ఈ బొచ్చు దానంతటదే రాలిపోతుంది. శీతాకాలంలో వాటి శరీరాలకు చలిబాధ లేకుండా పరమేశ్వరుడు చేసిన ఏర్పాటు. ఆ ప్రాంతీయులు ఆ బొచ్చుతో బట్టలు తయారుచేసి ఉపయోగించడం నేర్చేరు. అతిశీతల ప్రాంతాలలో మనుష్యుల చలిబాధ తీర్చడానికి నూలు బట్టలు పనికిరావు. అందుచేత ఉన్నితో బట్టలు తయారు చెయ్యడం ఒక వృత్తిగా, కళగా, ఏర్పడి పోయింది. శీతల ప్రాంతంలో పుట్టి పెరిగిన గొఱ్ఱెలకు పెరిగినంత పొడవైన బొచ్చు వేడిమిగల ప్రాంతాల గొఱ్ఱెలకు పెరుగదు. పొడవైన ఉన్నితో దుప్పట్లు రగ్గులు, శాలువలు నేస్తారు. వేడి ప్రదేశాలలోని గొఱ్ఱెల బొచ్చు పొట్టిగా ఉండుటవల్ల దీనితో కంబళ్లు, తివాసీలు తయారుచేస్తారు. కాశ్మీరము శీతలప్రాంతము గనుక ఆ ఉన్ని శాలువలకు పనికివస్తుంది.

సుబ్బయ్య ఆ గ్రామములో ఉన్న ఒక కార్ఖానాకు చేరుకున్నాడు. అక్కడ జరుగుతూన్న పని పరిశీలనగా చూస్తున్నాడు. గొర్రెలకు పెరిగినబొచ్చు కత్తిరించి తీసి పరిశుభ్రముగా కడిగి, జిడ్డు, ఇతరకల్మషాలు పోయేటట్టుగా క్షారజలంలోవేసి ఉడకబెడుతున్నారు. తెల్లనిది, ఎఱ్ఱనిది దొచ్చు రెండురకాలుగా వేరుపరస్తున్నారు. ప్రత్తిని ఏకి ఏకులుచేసికొని నూలుతీసినట్లు దీనినిగూడ బాణంవంటిసాధనంతో ఏకి రాట్నంమీద నూలుగా తయారుచేస్తున్నారు. దీనినే ఊలుదారం అంటారు. ఈ ఊలుదారంతయారైతే నేతకు సులువు. నూలుదారంవలె సన్నంగా ఉండదుగనుక ఉన్ని నేతకుఉపయోగించే మగ్గం ప్రత్యేకంగాఉంటుంది. మగ్గం నిలువుగా అమర్చబడి ఉంది. పన్నీలు కూడా వెడల్పుగా సందులు గలిగిఉన్నాయి. ఊలు స్వంతంగా తయారుచేసుకోవచ్చు లేదా పైనుండి తెప్పించుకొని నేతకు ఉపయోగిస్తారు. నూలు తయారీకి కాన్పూరు, తిరునల్వేలి జిల్లాలలోని అంబూరు నాణ్యమైన నూలుకు పేరుపొందేయి.



తివాసీలమీద నేతలోవేయదలచుకొన్న లతలు, పువ్వులు ముందుగా ఒక గళ్లకాగితంమీద వ్రాసుకొని ఆ నమూనానుబట్టి నూళ్లలెక్కకట్టి ముళ్లువేస్తారు. ఒక అంగుళంలో ఇమిడిన ఊలు

దారాల సంఖ్యనుబట్టి ఆ తివాసీ నాణ్యం నిర్ణయిస్తారు. నేతలో పడుగు నూలుదారాలతోను, పేకమాత్రం ఊలుతోను నేస్తున్నారు. నిలువుగాఅమర్చిన మగ్గంలో చూస్తూండగానే తేటైన రంగులతో లతలు, పూవులుగల తివాసీ తయారవుతూంది. అచ్చట వేరొక గదిలో అనేకరకాల డిజైన్లు తయారుచేస్తున్నారు. మరొకచోట బ్రాహ్మణులు పూజాసమయంలో, జపకాలంలోను ఉపయోగించే చిత్రాసనాలు తయారుచేస్తున్నారు. మరొకచోట ఎగుమతికి సిద్ధం చేయబడిన రత్నకంబళ్లు మూటలు కట్టబడి ఉన్నాయి. ఇవి ఎక్కడకు పంపుతారని సుబ్బయ్య ప్రశ్నించాడు. ఆ షావుకారు ఈ సరుకు అమెరికాపోతుందని జవాబిచ్చేడు. సుబ్బయ్య ఆశ్చర్యపోయాడు. ఈ ఊళ్లో సుమారు ఈ పనివాళ్లెంతమంది ఉంటారన్నాడు. అతడు 600 మగ్గాలున్నాయని నేర్పరులైన పనివాళ్లు రెంవందలు, వారిచేతిక్రింద పనిచేసి తరిబీదుపొందుతున్న వాళ్లు రెండువేలమందివరకు ఉంటారని చెప్పేడు. డబ్బున్న మహారాజులకుగాని ఈలాంటిసరకులు ఎవరికికావాలి అనుకుంటూ అక్కడినుండి బయలుదేరేడు. అతని మనస్సులో అనేక ఆలోచనలు. అటువంటివారు ఉపయోగిస్తుండబట్టేగదా ఇన్నివేల మందికి జీవనోపాధిఅయింది అని అనుకుంటూ స్టేషనుకువచ్చేడు. బండికి గంటకొట్టారు. ఆలోచనలతోనే బండిఎక్కేడు. సుబ్బయ్య ఊహాప్రపంచంలోంచి తేరుకోకముందే రైలు విజయవాడ చేరుకుంది. జనసమ్మర్దంగా ఉన్న స్టేషనులోదిగి ఊళ్లోకి బయలు దేరేడు. దారిలో కాశేశ్వరరావు మార్కెట్టువద్ద ఆగినబస్సు



తివాసీ నేత.

ఎక్కాడు. జలజలా ప్రవహిస్తున్న కృష్ణానది, పట్టణమధ్యగా ఎత్తైన కొండమీద కనకదుర్గమ్మగుడి చూస్తూ ప్రయాణంసాగిస్తున్నాడు. తిన్నగా కొండపల్లిలో ఆగింది బస్సు.

---

## కొండపల్లి బొమ్మలు

కొండపల్లి చాలా పురాతనమైన గ్రామం. ఎత్తైన కొండలతోఉన్న ఊరుచూస్తూ పోతూంటె ఒక కొండమీద శిథిలమైపోయిన కోట బురుజులు కనబడుతున్నాయి. మన సుబ్బయ్య ఆ కొండమీద కోట లేమిటని ఒక గ్రామస్తుని ప్రశ్నించాడు.

"అదే! కొండపల్లి కిల్లా అంటారు. ఒకప్పుడు విజయగరం పాలించిన శ్రీకృష్ణదేవరాయలు ఈ కోటను జయించాడు. తరువాత మొగలు చక్రవర్తులకు, హైదరాబాదు నవాబులకు ఇది యుద్ధ కేంద్రంగా ఉండేదని" వివరించాడు. సుబ్బయ్యకు పూర్వకాలం నాటి ముచ్చటలుఅంటే ఒడలు పులకరిస్తుంది. అవితలుచుకుంటూ నడుస్తూంటే ఒక యింటిలో అందంగా అమర్చిన బొమ్మలు అనేకరకాలలో ఉన్నవి అతడి కళ్లబడ్డాయి. అచ్చట ఆగి వాటిని పరిశీలిస్తున్నాడు.

ఆ బొమ్మల రంగులు, వాటి కట్టు బొట్టు అలంకారాలు మంచి ఆకర్షణీయంగా ఉన్నాయి. అందులో పురాణపురుషుల విగ్రహాలు, లక్ష్మీ సరస్వతులు, దశావతారాలు, పాండురంగడు,

రాసక్రీడలు, శ్రీరామ పంచాయతనము ఉన్నాయి. గుళ్ళ, గోపురాలు, లోగిళ్ళు, భవంతులు, కచ్చేరీ చావిడులు తీర్చి దిద్దిన



ట్లున్నాయి. ఒక తాడిచెట్టుమీదకు ఒకడు ఎక్కి కల్లు గీస్తున్నట్లు క్రింద పోలీసు ఉన్నట్టుగా చెక్కిన బొమ్మను చూచి సుబ్బయ్య ముచ్చటపడ్డాడు. పల్లెప్రాంతాలలో నిత్యం కనపడే కమ్మరి, కుమ్మరి, చాకలి, మొదలైనవారి విగ్రహాలు సహజంగా ఉన్నాయి. పాముల వాడు పామును ఆడిస్తూన్నట్లున్న బొమ్మ మిక్కిలి ఆకర్షణీయంగా తోచింది. ప్రపంచంలో ఉన్న రకరకాల మనుష్యుల జీవితాలన్నీ ఆ బొమ్మలలో సుబ్బయ్య చూడగలిగేడు. పూర్వకాలపు రాచ ఠీవిని జ్ఞాపకానికితెచ్చే ఏనుగంబారీలు, లొట్టిపిట్టలు మొదలైన జంతువులు సుబ్బయ్య మనస్సును ఆకర్షించాయి. లేగదూడ పాలుత్రాగుతుంటే తల్లి నాలుకతో ప్రేమతో నాకుతూన్న బొమ్మ చూడగానే సుబ్బయ్యకు ఇంటివద్దనున్న లేగదూడ జ్ఞాపకానికి వచ్చింది. మెల్లిగా తేరుకొని సుబ్బయ్య "ఈ బొమ్మలు దేనితో తయారుచేస్తారు" అని అడిగేడు. సుబ్బయ్య ఆసక్తినిచూచి ఆ బొమ్మల పరిశ్రమనుగురించి ఈ విధంగా ఒక శిల్పి వివరించాడు.

"ఈ కొండపల్లి కిల్లాప్రాంతపు అడవులలో పొణికి కఱ్ఱ విస్తారముగాలభిస్తుంది. బాడితకఱ్ఱవలె తేలికగాను, అంతకన్న జిగిగాను ఉంటుంది. ఆ మ్రానులుతెచ్చి ఎండించి చిన్న చిన్న ముక్కలుగా కోస్తారు. శిల్పులు ముందుగా ఆ కొయ్యముక్కకు బాపుదారుతో చెక్కి కన్ను, ముక్కు తీరులు కల్పించి బొమ్మలు తయారుచేస్తారు. చేతులు కాళ్లు విడిగాచేసి చింత అంబలితో అతుకుతారు. టోపీ, పాగా మొదలైన అలంకరణలు 'మక్కు'తో చేసి అతికిస్తారు. తరువాత సుద్దపూతపూసి దానిమీద కావలసిన రంగులువేసి కన్నులు కలకడతారు." ఇవన్ని వినేసరికి కరణంగా రింటిలోని బొమ్మలకొలువు జ్ఞాపకానికొచ్చింది మన సుబ్బయ్యకు. అక్కడ అతడుచూచిన మరొక విశేషమేమంటే పురుషులు బొమ్మల రూపాలు చెక్కుతుంటె స్త్రీలు రంగులువేస్తున్నారు. కోటీశ్వరునిమొదలు కూటి పేదవరకు బొమ్మలతో ఆనందించనివారెవరుం టారు. అక్కడినుండిబయలు దేరి మరొక కార్ఖానాకు



పోయాడు. అక్కడ అన్ని ఏనుగంబారీలు, మామిడికాయలు, సీతాఫలములు, గుడులు, గోపురాలు, తయారుచేస్తున్నారు. ఒక చోట కంచుసుత్తులు. ఒక దాగలిదిమ్మ, కుంపటి మొదలైన పరికరాలతో ఏదో బంగారంపని చేస్తున్నారు. అక్కడ ఆగి "మీరు బంగారం పనులుకూడా చేస్తారా?" అన్నాడు.

## కుందనపు రేకులు (GOLD LEAF)

"ఇది బంగారంపనేగాని నగలు తయారీ కాదు. వీనిని కుందనపు రేకులంటారు. దీనిని పూర్వకాలంలో మహారాజులు వేడి అన్నంమీద పరచి భుజించేవారు. ఆ వేడికి ఆ రేకు కరిగిపోతుంది. ఒక గురివింద పూస బరువుగల మేలిమి బంగారంతో అరచేయి వెడల్పుగల సున్నితమైన పలుచనిరేకులు తయారౌతాయి. ఇదిగో! పరీక్షించండి! మేలిమి బంగారంతో చేతితోనే తయారుచేస్తాం."

అని ఒకరేకుతీసి చూపాడు. పలుచని కాగితపు పొత్తిళ్ళలో తళతళ మెరుస్తూ ముక్క గాలికి ఎగిరిపోయేవిధంగా ఉంది.

"ఇది ఇంకెందుకు ఉపయోగముంటుంది" అని మళ్లీ ప్రశ్నించాడు,

"పూర్వకాలంలో రాజుల రూపచిత్రాలు వ్రాసి వాటికి ఈ రేకులతో అలంకారాలు వేసేవాళ్లము. వాహనాలకుకూడా అలంకారాలకు ఉపయోగిస్తాం."

"పనిపాటలుబాగున్నాయా?" అన్నాడు సుబ్బయ్య.

"ఈ రోజులలో ఈ సున్నితం పనులన్నీ మనతెనుగునాట క్షీణించిపోయినవి. మహారాజుల ఆదరణలో మాకు చేతినిండా పనులుండేవి. ఈనాడుఈ వృత్తులవల్ల జీవనోపాధి గడవటం కష్టంగానేఉంది."



కొండపల్లి బొమ్మలు-పక్షులు.



బందరు కలంకారీ అద్దకములు.

చిన్న రుమాళ్లు

"గడవనప్పుడు మరొకవ్యాపారం చూచుకోక ఎల్లకాలం ఒకేపనితోఉంటే ఎలాగని" అన్నాడు.

"ఆ విషయం మీరు చెప్పాలా ? తరతరాలుగావస్తున్న పనులను విడువలేక, క్రొత్తమార్గంలో అలవాటుపడలేక బాధలు పడుతున్నాము. చేతిలోఉన్నపని కాలానికితగినట్లు మార్చుకోవాలి గదా ! ఈమధ్యనే గవర్నమెంటువారి సాయంకూడా దొరుకుతుం దంటున్నారు. అదే కొంతఆశగా ఉందని" ఆ శిల్పి జవాబిచ్చేడు.

సుబ్బయ్య మళ్లీ ఆలోచనలోపడ్డాడు. ఒక్కొక్కపని చూస్తూంటే ఒక్కొక్క వింతగా ఉంది. మనుష్యుని చేతిలోగల పనితనాన్ని అవగాహనచేసికొన్నకొద్దీ అంతు దొరకటంలేదు. ఈ వింతవింత పనులు చేయించడానికి ఆ నాటి రాజులకే చెల్లు ననుకుంటూ అటనుండి బయలుదేరి బస్సుమీద బెజవాడచేరుకు న్నాడు. వెంటనే హోటలుకుపోయి భోజనంచేసి స్థిమితపడ్డాడు.

విశ్రాంతికి ఆ రాత్రి ఊళ్లోనే ఉండిపోయాడు. తాను బసచేసినచోటికి దగ్గరలోనేఉన్న కోవెలలో ఎవరో మహనీయుడు వాల్మీకి రామాయణం పురాణ కాలక్షేపంచేస్తున్నాడు. కిష్కింధా కాండ జరుగుతుంది. ఆ నాటి కథా సందర్భంలో ఆప్రాంతపు పచ్చిక భూముల వర్ణన వివరిస్తున్నాడు. అది యిలా ఉన్నది.

శ్లో॥ బాలేంద్ర కోపాంతర చిత్రితేన
విభాతి భూమి ర్నవ శాద్వలేన
గాత్రాను వృత్తేణ శుకప్రభేణ
నారీవలాక్షామోక్షిత కంబళేన॥ — (కి॥ కాం 28 సర్గ)

అనగా లేత పచ్చిక బయళ్లలో మధ్యమధ్యను కనబడుతూన్న ఆర్ద్రపురుగులతో ఈ భూమి ఎఱ్ఱని చుక్కలద్దిన చిలకరంగు శాలువా కప్పుకొన్నట్లు ఉన్నదని ఆ శ్లోకార్థాన్ని వివరించాడు. ఈ శ్లోకంలో రామాయణకాలంనాటి అద్దకపుపనిని స్ఫురింప జేస్తూ వాల్మీకియొక్క స్వాభావికమైన వర్ణనాపైచిత్రిని ప్రశంసించాడు. అంతతో ఆగక చేరువనేఉన్న బందరు కలంకారీ అద్దకాలను జ్ఞాపకంచేసి అనాటినుండి నేటివరకు మన దేశంలో వస్తున్న కళా సాంప్రదాయాన్నికూడా వివరించాడు. అనంతరం కథా ప్రసంగంలోకి మళ్లిపోయాడు. రాముడు సుగ్రీవునితో మైత్రి నెరపడంతో ఆనాటి పురాణకాలక్షేపం ముగిసింది. సుబ్బయ్య మెల్లిగా బసలోకి చేరుకొన్నాడు.

---

## కలంకారీ అద్దకములు

ఉదయమే బయలుదేరి బందరుచేరుకొన్నాడు. ఆంధ్ర దేశంలో అనేకచోట్ల అద్దకం పరిశ్రమ అభివృద్ధిలో ఉన్నప్పటికీ బందరులోచేసే పనికిమాత్రము ఒకప్రత్యేకత ఉంది. బందరు కాలంకారీ అద్దకాలు ప్రపంచ విఖ్యాతిపొందాయి. పూర్వం కలంతో బట్టమీద రంగులువేయడంవల్లనే వాటికి కలంకారీ అన్న పేరు వచ్చింది. ఈ రంగులు నీటికి ఎండకు వెలిసిపోక తేటుగా ఉంటాయి. ఈ అద్దకంలో పూర్వపు పద్ధతులకు యిప్పటి వాటికి

చాలా వ్యత్యాసముంది. పూర్వకాలంలో రంగులు తయారుచేయ డానికి చెట్లకు సంబంధించిన పండ్లు, పువ్వులు, ఆకులు, వేళ్లు, గింజలు, బెరడు మొదలైనవాటి కషాయాలు వాడేవారు. నీలి మందు, కుసుంబా పువ్వు, కాచు, రేవలచిన్ని, దానిమ్మతొక్కలు, చిరువేరు, కరక్కాయ, జాభరా గింజలు మొదలైనవి ఉపయో గించేవారు. కుసుంబా పువ్వుతో గులాబిరంగు, చిరువేరుతో లేత ఎరుపురంగు, జాభరా గింజలతో కనకాంబరపురంగు వేసేవారు. ఆ పద్ధతులు కాలయాపన, శ్రమతోకూడుకొన్నవి అవడంచేత వాటిని మాని నూతనంగావస్తూన్న రసాయనిక రంగులు (ఎనలైన్ డైన్) తో సునాయాసంగా చిత్రవిచిత్రమైన అద్దకం పనులు చేస్తూన్నారు. సుబ్బయ్య చెంగావి పంచెలు కట్టుకోవటం బాగా ఎరుగును.

తయారుచేసే విధానంమీద ఆసక్తిగలవాడు అవడంచేత అతడు క్రమంగా ఒక అద్దకపుపనిచేసే కార్ఖానాకు చేరుకొన్నాడు. ఆ కార్ఖానాలో కొందరు విద్యార్థులుకూడా ఉండి ఆ పనిని నేర్చుకుం టూన్నారు. పిల్లలు చదువుకోవాలిగాని ఈ పనేమిటని మొదట సుబ్బయ్య కొంత కలతపడ్డాడు. కాని ఎంతచదువుకున్నా కూటికి గుడ్డకు అక్కరకురాదుగదా ! పని నేర్చుకొంటేనే నయమన్నట్లు తోచిందాతనికి. అక్కడఉండి పనినేర్పుతూన్న ఒకపనివాడు చక్కగా ఈ అద్దకం పరిశ్రమలోగల వివిధవిషయాలను ఆ యా దశలలో పనిజరుగుతూండగా సుబ్బయ్యకుచూపిస్తూ వివరించాడు. బట్టలు ముందుగా చలువచెయ్యాలి. చలువ లేకపోతే రంగు సరిగాపటదు.

అనంతరం రంగు వేయదలచుకొన్న బట్టలకు వగరు, పులుపుకల పదార్థాలతో కసటువేస్తారు. బట్టకు రంగు పట్టడానికి కసటు వేయుట ముఖ్యము. టేకు కఱ్ఱమీదచెక్కిన అచ్చులతో నేర్పరులైన పారిశ్రామికులు బట్టమీద రంగు అద్దుతారు. ఎన్నిరంగులలో



ఆ చిత్రము అద్దాలో అన్ని దిమ్మలు ఉంటాయి. ఈ విధమైన అద్దకానికి ఒక ఎత్తైన బల్ల దానిపైని ఒక చదరపు బాయి దానిపైన కంబళి ముడతలులేకుండా పరిచి, దానిమీద గుడ్డను వెడల్పుగా ఉంచి అద్దవలసిన స్థలంలో గుర్తులుపెట్టుకొని కొయ్యసుత్తులతోకొట్టి ఆ దిమ్మలద్దుతారు.

ఇది సర్వసాధారణంగా చేసే పూర్వపద్ధతి. శాస్త్రపరిశోధనలు చేసినమీదట రసాయనిక పద్ధతులలో రంగులద్దుతున్నారు. చాకలిసోడా మొదలైన ద్రవ్యాలు ఉపయోగించి త్వరితంగా ఉడికించి బట్టలు చలువచేస్తున్నారు. రంగులు నీటితో ఉతికినా, సబ్బుతో ఉతికినా, సోడాతో ఉడికించినా, చెమటపట్టినా, ద్రావకాలలోవేసినాకూడా వెలిసిపోని రంగులు కనిపెట్టి వేస్తున్నారు. ఇన్నిశోధనలకు ఆగే రంగులనే ఎనలైను డయ్యింగు అంటారు. కావలసిన రంగు ఏర్పడడానికి ముందుగా రెండు మూడు రకాల రసాయనిక ద్రవ్యాలలో ఊరబెట్టుట, ఉడికించుట మొదలగు

క్రియలు వరుసగాచేస్తే క్రమంగా కావలసినరంగు ఆ బట్టమీద స్థిరపడుతుంది. పూర్వకాలపు అంచులు మామిడిపిందెలు, పద్మాలు, లతలు అనేకరంగులలో తయారుచేస్తున్నారు. పూర్వపు పద్ధతుల కంటె వీటిలో సులువు, త్వరగాచేసే విధానం ఇమిడిఉన్నాయి. ఈ నూతనవిధాలన్నీ చూస్తూంటే సుబ్బయ్యకు అదొక ఇంద్రజాలంలా గనిపించింది. రంగులతోనున్న ఆ బట్టల బేళ్లనుచూస్తే పురాణంలో విన్న వర్ణనలు స్ఫురణకువచ్చాయి. మళ్లీ బెజవాడ చేరుకున్నాడు.

---

## చందనం బొమ్మలు (తిరుపతి, కాళహస్తి)

బెజవాడనుండి గూడూరు మీదుగా రైలు తిరుపతి చేరుకుంది. దారిలో గూడూరునుండి ఏడుకొండలవాడా! వెంకటరమణా! గోవిందా అనే యాత్రికుల నినాదాలతో సుబ్బయ్య మనస్సుకూడా భక్తి పరవశమైంది. తన ప్రయాణంఅంతా మనోవీధిలో ఒక చలనచిత్ర ప్రదర్శనంలా జరిగిపోయింది. కనుమూసి తెరచినంతలో ఏడుకొండలూ దాటిపోయాడు. వెలలేని రత్నాభరణాలతో కన్నులు మిరుమిట్లుగొలిపే దివ్యతేజస్సుతో సాక్షాత్ శ్రీ వెంకటేశ్వరస్వామి సుబ్బయ్య అమాయిక హృదయంతో స్మరించగానే దర్శనంయిచ్చేడు. తన అదృష్టానికి మురిసిపోతూ సుబ్బయ్య సాష్టాంగవందనంచేసి మ్రొక్కుబడులు చెల్లించుకొ

న్నాడు. గుడి ప్రాకారాలు విడిచి కొండదిగి పట్టణవీధులు చూచుకొంటూ వస్తూన్నాడు. ఒక బజారులో నలుపు, ఎరుపు కలసిన చేవకఱ్ఱతో చెక్కిన చందనం బొమ్మలు, యిత్తడి సామానులు కన్నులు చెదిరిపోయేటట్లుగా కనబడ్డాయి. చందనం బొమ్మలలో వెంకటేశ్వరస్వామి అలువేలుమంగ విగ్రహాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. విగ్రహంయొక్క అవయవములన్నీ వేరే అతుకకుండా ఒకే కొయ్యలో చెక్కబడి ఉన్నాయి. అందచందములుకూర్చే ఆభరణాలన్నీ చెక్కడంలోనే తీర్చి దిద్దబడినాయి. రంగులు లేకపోయినా ఆ చేవకొయ్యమీద బొమ్మలు ఎంతో ఆకర్షణీయంగా ఉన్నాయి. యాత్రికులు ప్రతిఒక్కరు ఏదోరకం విగ్రహాన్ని కొని పోతూన్నారు. తిరుపతికి చేరువనేగల తిరుచానూరు చెన్నపట్నం దగ్గరనేఉన్న కోసాపేటలోను ఈ బొమ్మలను చెక్కడమే కులవృత్తిగాగల వారున్నారు. ప్రతీరోజూ అనేక గ్రామములనుండి యాత్రికులుగావచ్చే స్థలాలలో ఈ బొమ్మలు బాగా అమ్ముడుపోతాయి. ఈ బొమ్మలకు పనికివచ్చే రక్తచందనం కఱ్ఱకూడా కాళహస్తి, తిరుపతి ప్రాంతాలలో బాగా దొరుకుతుంది. తెల్లని కఱ్ఱతో తయారుచేసిన కొయ్యదువ్వెనలుకూడా ఆ దుకాణాలలోఉన్నాయి. ఈ పరిశ్రమలోకూడా పెట్టుబడిదారుని దయాధర్మములపైననే శిల్పి ఆధారపడవలసి వస్తుంది. ఈ బొమ్మలను చూచిన అనంతరం సుబ్బయ్య ఇత్తడి కంచు సామానులను చూడబోయేడు.

---

# ఇత్తడి కంచుపనులు

ఆ బజారులో చెంబులు, బిందెలు మొదలుగాగల పాత్ర సామగ్రిగాక పూజాపరికరములు దేవతా విగ్రహములు అనేక రకాలలో చూడ ముచ్చట గొలుపుతున్నాయి. దీపహార తులు, సెమ్మాలు, హారతి పళ్లెములు మొదలగునవి చిత్ర విచిత్రమైన లతలు, పక్షులు, విగ్రహముల ఆకారములతో పోతపోయబడినవి, అతిసుంద



రంగాఉన్నాయి. దేశదేశాలనుండివచ్చే యాత్రికుల అభిరుచులకు తగినట్లుగా, స్థానికమైన, శైవ, వైష్ణవ మత సంప్రదాయములకు అనుగుణ్యంగా ఈ లోహపు పనివాళ్లు చేసిన పనులకు సుబ్బయ్య అబ్బురపడి చూచాడు. శ్రీరామ నవమి పండుగ రోజులలో తన స్వ గ్రామంలో రామ కోవెలలో ఉన్న ఇత్తడి చెట్టు నిండా దీపాలు వెలిగించి గ్రామపెద్ద



లంతా కలసి చేసేరామభజనలు సుబ్బయ్య మనస్సులో ఒక్క మారు తళుక్కుమని మెరసినవి. తాను చూచిన చిత్రాలనుతలచు కొంటూ మళ్లా రైలెక్కి రేణిగుంట చేరుకొన్నాడు.

# గాజు పూసలు

ఆ ప్లాట్‌ఫారంమీద రంగురంగుల పూసలు సరాలు కట్టలు కట్టలుగా మెడలోవేసికొని గుంపులుగుంపులుగా జనంకనబడ్డారు. వారిలో స్త్రీలు పురుషులుకూడా ఉన్నారు. వాళ్లదగ్గరగావెళ్లి ఈ పూసలసరాలు ఎక్కడనుండి తెస్తున్నారని సుబ్బయ్య వాళ్లను ప్రశ్నించాడు. పాపానాయుడు పేటనుండి తెస్తున్నామని వాళ్లు జవాబిచ్చేరు. మరొక స్త్రీదగ్గర బుట్టలో చూడ మెల్లొకట్టే పెద్దరకం పూసలున్నాయి. సుబ్బయ్యదృష్టి వాటిమీదకుపోయింది. ఇంటివద్ద మొన్ననే పుట్టిన కోడెదూడ ఛెంగుమని గంతువేసినట్లు తోచింది. దాని మెడ బోసిగాఉంది. ఈ పూసలదండ కొని దానిమెళ్లో కట్టాలనుకొన్నాడు. భోగట్టాచేస్తే 6 మైళ్లదూరం అని తెలిసింది. తిన్నగా బండిచేసికొని పాపానాయుడుపేట చేరుకొన్నాడు. ఊళ్లో కాలవ ఒడ్డునే పూసలు తయారుచేసే పాకలున్నాయి. పెద్దపెద్ద పొయ్యిలమీద గోళెములవంటి కుండబానలలో ఏదో గాజుముక్కలు వేసి కరిగిస్తున్నారు. ఈ కరిగించే వస్తువులేమిటని సుబ్బయ్య ఆ పనివారిని ప్రశ్నించాడు. ఇది ఒక గాజురాయి ఆగ్రా జిల్లా ఫిరోజిదాబాదునుండి దిగుమతి అవుతుంది. ఇదే గాజుపూసలు చెయ్యడానికి పనికివచ్చే ముడిసరుకు అని చెప్పేడు. ఈ విధంగా కరిగిన గాజుముద్ద వేడిగాఉండగానే జీళ్ల పాకంవలె పొడవైన యినుపగొట్టాలకు వేసి చుట్టబెడుతున్నారు. ఆ ముద్దను చేతితో అదిమి జీళ్లపాకంవలె సాగదీస్తున్నారు. అలా సాగదీస్తూంటె వాళ్ల చేతి పనివాడితనం ఏమోగాని మధ్య

రంధ్రం బోలు చెడకుండా సాగుతుంది. ఈవిధంగా చీపురు పుల్లంత సన్నమయ్యేవరకు దానిని సాగదీసి సుమారు 2 అ. లేక గజం పొడవు ముక్కలుగాచేసి విరుస్తున్నారు. అవి చల్లారి చీపురుపుల్లలవలె బిగిసిపోతున్నాయి. మరొకరు ఈ పుల్లలను కట్టలు కడుతున్నారు. ఈ గాజు పుల్లలను లెక్కించి స్త్రీలు, పిల్లలు వాళ్ల యిళ్లకు తీసికొనిపోతున్నారు. సుబ్బయ్య వెంటనే ఈ పుల్లలు ఎక్కడికి తీసికొనిపోతారు? ఏమిచేస్తారని ప్రశ్నించాడు. వాళ్లలో ఒకరు ఈపుల్లల కట్టలను మా యిళ్లకు పట్టుకొనిపోయి కూలికి పూసలు తెగగొట్టి షావుకారి కిస్తామన్నారు. ఏలా చేస్తారని మళ్లీ ప్రశ్నించాడు. అంపంపళ్లవంటి చిల్లులుగల వెడల్పయిన ఉలితో దాగలిమీద వేసి వాటిని పూసలుగా తెగగొట్టి వాటిని ఎఱ్ఱని యిసుకతో కలిపి మండిగలోవేసి వెచ్చచేస్తూ గుండ్రని కఱ్ఱదిమ్మలతో బటాణీలు రాసినట్లు రాయగా వాటికి పూస ఆకారం ఏర్పడుతుంది. ఆ పిమ్మట ఈ పూసలను ఊకతో కలిపి కొయ్యరోళ్లతో దంచుతే పూసరంధ్రాలలోగల యిసుక, బూడిద పోయి పూస నున్నగా తయారవుతుంది. ఈ విధంగా తయారైన పూసలను చేటలలోపోసి మట్టి చెరిగి సరాలుగా తయారుచేసి అమ్మకానికి సిద్ధపరుస్తారు. అని ఆ పరిశ్రమను వివరించాడు. ఈపని అంతా స్త్రీలు, పిల్లలుఎక్కువగా చేస్తున్నారు, ఇది వాళ్లకు జీవనోపాధిగా పనికివస్తుంది. ఈ పూసలు పౌనులు ప్రకారం తూకం తూచి అమ్ముతారు. పౌను 1కి 8 అ. మొదలు రు. 15 వరకు విలువచేసే రకరకాల సరకులు అనేక రంగులలో

తయారవుతున్నాయి. పుణ్యస్త్రీత్వానికి గుర్తుగాఉండే నల్లపూసలు మొదలు, నాగరికులు అందాలకై మెడలోధరించే రంగురంగుల పూసలు, దూడ మెడలోకట్టే పెద్ద పూసలకు ఈ పాపానాయుడు పేటకు దేశప్రఖ్యాతి ఉంది. "ఈ గాజుపూసలు ఇంకెక్కడైనా తయారౌతాయా" అని ప్రశ్నించేడు. అక్కడున్న పెద్ద "లేకేం బాబు, కాళహస్తిలోను, అనంతపురంజిల్లా గుట్టూరులోను, విశాఖపట్నం జిల్లా సింహాచలంలోనుకూడా ఈ పని ఉంది. ఈమధ్యను గవర్నమెంటువారు ఈ పనిని జీతాలిచ్చి పిల్లలకు కూడా నేర్పిస్తున్నారు." అని చెప్పేడు. సింహాచలంలోకూడా ఈ పని ఉందనగానే సుబ్బయ్యకు తన ఊరుకు దగ్గరగా ఒక కార్ఖానా ఉందని సంతోషించాడు. ఎంత చదువుకున్నా ఉద్యోగాలే లేవు. పిల్లలకు పనిపాటులు నేర్పిస్తేనే బాగుంటుంది- అనే అభిప్రాయం బలపడింది. కోడెదూడ మెడలోకి పెద్దపూసలు కొనుక్కొని బయలుదేరేడు.

---

రైలు ఆంధ్రరాజధాని హైదరాబాదుకు నిప్పుబ్రక్కుతూ, పొగలు జిమ్ముతూ శరవేగంతో బయలుదేరింది. ఆ పెట్టెలోనే వివిధప్రాంతాల జనులు అనేకరకాల వేష భాషలతో కన్నులపండు వుగా నిండిఉన్నారు. బండిలో నలుమూలలా రకరకాల ప్రసంగాలు సాగిపోతూన్నవి. సుబ్బయ్య కూర్చొనిఉన్న బల్లమీద ఒకరు ఆంధ్రుల చిరకాలవాంఛితం విశాలాంధ్ర ఏర్పాటుచేసికోవటం రాజధానిగా హైదరాబాదు సంపాదించుకోవడంచాలా గొప్పవిషయ మని చెపుతు ఆప్రాంతమందలి వింతలు విశేషాలు వివరిస్తున్నాడు. ఇంతలో రైలు ఆగింది. అది వరంగల్ స్టేషన్ అన్నారు. ఎవరో శ్రీమంతులు గాబోలు కన్ను మిరుమిట్లు గొలిపేలాంటి జరీదుస్తులతో రైలు ప్లాట్‌ఫారంమీద సుబ్బయ్యకు కనబడ్డాడు. కుతూహలంఆగక "వారెవరో మహారాజులాగున్నారు" అన్నాడు. "మహారాజులుపోయి చాలాకాలమయింది. వారు హైదరాబాదుకు చెందిన శ్రీమంతులుతప్ప వేరుకాదు. "వారి బట్టలు అలా మెరిసి పోతున్నాయి ఏమి"టన్నాడు. అవే "హిమ్రూ" బట్టలంటారు. ఇది చాలా సున్నితమైన చేనేతపని. ఔరంగాబాదులోను అక్కడ దగ్గరలోఉండే "పైతాన్"లోను ఇవి తయారుచేస్తారు. ఇదొక్క టేమిటి ఆంధ్రరాజధాని ఒక్కటేగాక తెలంగాణఅంతకు అంద చందాలకు అపురూపమైన చేతిపనులకు అనాదిగా ప్రఖ్యాతి ఉంది. బహమనీ సుల్తానులు మొదలు ఈతరంలో అంతరించిపోయిన ఆసఫ్‌జాహి రాజవంశంవరకు ఎంతెంత ఐశ్వర్యంతో, ఎన్నెన్ని భోగాలతో తులతూగిందయ్యా ఈ గడ్డ. వరంగల్‌లో ఈనాటికి ప్రశస్తమైన తివాసీలు నేస్తారు. నిర్మలలో కత్తులు, కొయ్య

బొమ్మలు చేస్తారు. కరీంనగరంలో వెండి, బంగారు, జంతారు పనులు, (Filgieee) 'బీదర్'లో 'బిద్రి' అనే లోహపు పాత్రలు 'పైతాన్'లో వింతవింతలైన చీరల అంచులు తయారుచేస్తారు. మార్కోపోలో అనే వెన్నిసు వర్తకుడు 13వ శతాబ్దములో అనగా 7 వందల సంవత్సరాల క్రిందటనే మనదేశం వచ్చేడు. అతడు వీటి అందచందాలనుచూచి ఈ ప్రపంచంలో రాజాధిరాజులు కూడా ఇవి ధరించడానికి ముచ్చటపడతా రన్నాడు. అందువల్ల మనవాళ్ల పరిశ్రమలకు ప్రపంచమంతా గౌరవమున్నదయ్యా" అని వివరించాడు. సంభాషణ సాగిపోతూన్నంతసేపు కాలం తెలియకుండా గడిచిపోయింది. హైదరాబాదు స్టేషనులో రైలు ఆగింది.

సుబ్బయ్య మెల్లిగా రైలుదిగి పట్నంలో ప్రవేశించేడు. అందమైన భవనాలు, విశాలమైన వీధులు, బజారులోతిరిగే రకరకాల వేష భాషలుగల జనాన్ని విస్తుపోయిచూస్తూ ఒక హొటలులో ప్రవేశించేడు. భోజనం పూర్తిగావించుకొని కొంత విశ్రాంతితీసికొని వీధులలోకి బయలుదేరాడు. ఒకచోట ప్రత్యేకంగా ఏర్పాటైన మైదానంలో గొప్ప ఎగ్జిబిషను జరుగుతూంది. దానిని ఆంధ్రప్రభుత్వమువారే ఏర్పాటుచేసేరు. చూచిపోయే జనం తెరపిలేకుండా ఉన్నారు. అందు ముఖ్యంగా ఆంధ్ర దేశపు చేతిపనులు ప్రదర్శించారు. ప్రతి విభాగంలోను అందరికి అర్థమయ్యేటట్లుగా అందుకై ప్రత్యేకంగా నియమితులైనవారు ఆ యా పనులను చక్కగా వివరిస్తున్నారు. శబ్ద విపులీకరణ యంత్రాలు బాగా ఏర్పాటుచేసేరు.



బందరు కలంకారీ అద్దకం శాలువా.

31 వ పేజీ.



హిమ్రూ నేతబట్టలు-హైదరాబాదు.

## హిమ్రూ మష్రూమ్ కంకాబ్ నేతబట్టలు

"అయ్యా ఇవి హిమ్రూ నేతబట్ట లంటారు. ఇవి సన్నని ప్రత్తినూలుతో అందమైన సిల్కునూలు పడుగుపేకలుగా కలిపి అనేక అందాలలో తయారుచేస్తారు. ఈ రంగులు, ఈ కళా నైపుణ్యం గమనించండి. ఈ లతాచిత్రాలు వీటి ప్రత్యేక ఆకర్షణ. నేత దట్టంగాఉంటుంది. 280 పడుగునూళ్లుగల 1 చదరపుగజం గుడ్డ 3 మొదలు 5 అవున్సులు బరువుగలిగి ఉంటుంది. ఈ పరిశ్రమలో నేర్పరులైనవారు ఔరంగాబాదులో ఉన్నారు. 200 మగ్గాలు ఈ సున్నితమైన పనిలో ఉన్నాయి. మష్రూమ్, కంకాబ్ అనేవి దీనిలోని రకాలు. ఈనాటిదుస్తుల అలంకరణలో, అందచందా లలో మార్పులువచ్చి ఈ పరిశ్రమకు ఆదరణతగ్గినా ఇటీవలనే ప్రభుత్వంవారి ప్రోత్సాహంపైన మళ్లీ చిగురిస్తూంది. ఇట్టి దేశీయపరిశ్రమలను అందరూ ప్రోత్సహించాలి"అని చెపుతూన్న మాటలు ఆశ్చర్యంగా వింటూ అవి చూచివచ్చాడు సుబ్బయ్య-మరొక విభాగంవద్ద ఆగి పరిశీలిస్తున్నాడు.

## పైఠాన్ జరీబట్టలు

ఆ వింతబట్టలను చూపి అచ్చటి పారిశ్రామికుడు ఇలా వివరిస్తున్నాడు- "దక్కన్‌లో పైఠాన్ ఔరంగాబాదుకు 35 మైళ్ల దూరంలోఉంది. ఇచ్చట వెండి, బంగారు జరీలతో బట్టలు చీరలు, పీతాంబరాలు, సరిగెంచు చీరలు తయారవుతాయి. ఆనాటి పాలకులైన నవాబులు ఈ పరిశ్రమను పోషించారు. వీనిలో 1000 రు.

వరకు విలువగల బట్టలున్నాయి. 15 తులాల వెండిపైన 2 తులాల బంగారం పలుచని రేకుగాచుట్టి తీగలుగా కమ్మెచ్చులో పెట్టి వెండ్రుకవాసిగా సాగదీస్తారు. అది నేతకు అనుకూలమైనంత సన్నంగా తయారవుతుంది. ఈ అపురూపమైన కంకాబ్ నేత పరిశ్రమ మళ్లీ ప్రభుత్వసహకారంతోనే చివురుదొడుగుతూంది." సుబ్బయ్య మరొకచోట ఆగేడు.

---

## ఫిల్‌గ్రీ నగిషీపనులు

అక్కడ రకరకాల గాజులు, తమలపాకుల బరిణెలు, చిన్న చిన్న పెట్టెలు, పూలచెండ్లు, బొత్తాలు, సిగరట్ కేసులు, పౌంటెన్ పెన్నులు, సెంటు బుడ్లు, పతకములు, చెంచాలు అన్నీ ఆ విభాగంలోఉన్నాయి. ఈ సామానులు దేనితో తయారుచేస్తారనిఅడిగేడు సుబ్బయ్య "కరీంనగరంలో అతి సున్నితమైన ఈ నగిషీపనులుచేస్తారు.



సుమారు200 మంది కంసాలులు ఈపనులనే వంశపారంపర్యంగా చేస్తున్నారు. వీటికి చిరకాల ప్రఖ్యాతి ఉంది" అన్నాడు.

---



ఫిల్‌గ్రీ వెండి నగిషీ పనులు-హంస, చందు పెట్టి (హైదరాబాదు)



బిద్రినగిషీ లోహపాత్రలు-పళ్లెము.

# బిద్రి నగిషీ లోహపాత్రలు

మరొక విభాగంలో ఇత్తడిమీద రంగులువేసిన లతలతో చిత్రవిచిత్రమైన నగిషీలతో పాత్రలు, పళ్లెములు అమర్చబడి



ఉన్నాయి. పళ్లెములు, నీటి కూజాలు, హుక్కాగొట్టాలు, సుగంధద్రవ్యాలు దాచుకొనే డబ్బాలు, పూలచెండ్లు పెట్టుకునే కూజాలు మొదలైనవి అనేక రకాలలో ఉన్నాయి- "ఇది బహమనీ సుల్తానుల నాటి పరిశ్రమ. పరిష్యా దేశంనుండివచ్చిన శిల్పకారులవల్ల ఈపని మనదేశానికి వచ్చింది. రాగి, సత్తు ఇతరలోహములు కలిపి కరిగించిన ప్రత్యేక లోహంతో ఈసామగ్రి తయారుచేస్తారు. ఈలోహములకూడికతో తయారైనపాత్రలు త్రుప్పుపట్టవు, కగ్గిపోవు. ఈ పాత్రలలో పోసి నీరు త్రాగితే, ఆరోగ్యానికే గాక. కొన్ని రోగములు నివారణకుకూడ పనికివస్తుంది.

ఈ పాత్రలమీద చెక్కిన లతాచిత్రాలు నగిషీలు ప్రఖ్యాతి వహించిన బీదరు కోట, అజంతా చిత్రాలను అనుకరించి చెక్కబడినవి. సుబ్బయ్యకు ఈ పనుల సున్నితాన్నిచూస్తే మిక్కిలి ఆశ్చర్యకరంగాఉన్నాయి. మరొక విభాగాన్ని చూచాడు.

# నిర్మల కఱ్ఱబొమ్మలు

ఆకర్షణీయమైన రంగులతో, పళ్లెములు పెట్టెలు ఒకవైపు నను, అప్పుడేవచ్చి వ్రాలినవా అన్నట్లుగాఉన్న రకరకాల పక్షులు, జంతువులు అప్పుడే కోసి తెచ్చినట్లున్న పళ్లు అందంగా అమర్చబడిఉన్నాయి. అక్కడనున్న ప్రదర్శకుడు "ఇవి అదిలాబాద్ జిల్లాలోగల నిర్మలలో తయారైన కొయ్యబొమ్మలు. బూరుగ, పొణిక కఱ్ఱలతో ఈబొమ్మలు చేస్తారు. చింతంబలితో వివిధావయవాలు అతికి ఆకర్షణీయమైన రంగులు వేస్తారు. ఇది



ఆంధ్ర శిల్పకళా కౌశలానికి మచ్చుముక్కవంటి"దని వివరిస్తున్నాడు. తానిదివరకు కొండపల్లిలోచూచిన బొమ్మలు సుబ్బయ్యకు గుర్తుకువచ్చాయి. కొంతదూరంపోగా అక్కడొక బహిరంగసభ జరుగుతూంది. అందులో ఒకప్రముఖుడు ఈవిధంగా ఉపన్యసిస్తున్నాడు-

"మహాజనులారా! ఆంధ్రదేశం అనేక కుటీరపరిశ్రమలకు ప్రఖ్యాతిగొన్న ప్రదేశం. భారతదేశం వ్యవసాయానికి ఎంత ప్రాముఖ్యత వహించిందో గృహ పరిశ్రమలకుకూడా ఒకప్పుడు అంత ప్రఖ్యాతిగాంచింది. గ్రామజీవితం సౌభాగ్య



నిర్మల కఱ్ఱబొమ్మలు-పులి, పికిలిపిట్ట.



బిద్రినగిషీ లోహపాత్రలు కూజా.

వంతంగా ఉండడానికి వ్యవసాయం, పశుపోషణతోపాటు, నిత్య జీవితావసర వస్తువులను తయారుచేసే కమ్మరం. వడ్రంగం, కంచరం, కుమ్మరం మొదలైన పరిశ్రమలన్నీ పునరుద్ధరించడానికి ప్రభుత్వం పూనుకుంటూంది. ఇవిగాక ప్రజల నూతన అభిరుచులకు తగినట్లుగా అనేక సామానులనుగూడ కుటీర పరిశ్రమలలో చేసికోవచ్చు - దీనికి పూర్వవిధానాలేగాక ఆధునికపద్ధతులలో వారికి సాంకేతిక శిక్షణలిచ్చి దేశావసరాలు తీర్చడానికి ప్రభుత్వం పూనుకున్నది. కాబట్టి నిరుద్యోగులుగా నున్నవారు, స్వతంత్ర జీవనం గడపదలచినవారు ఈ పరిశ్రమలను చేపట్టి తాము తరించి దేశాన్ని సుభిక్షం చేయండి" అని హెచ్చరిస్తున్నాడు.

ఇంతలో తెల్లవారుఝామున పొలానికి వెళ్లడానికి పాలికాపు వచ్చి పిలిచిన కేకతో సుబ్బయ్యకు మెలకువవచ్చింది.

---

పుస్తకములకు :—

పెరూరి సత్యవీరవెంకటేశ్వరావు

వెంకటనారాయణ వీధి

గాంధినగరం

**కాకినాడ**

అని వ్రాయవలెను